విడి పత్రిక ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 103232 జనవరి 9 వ తేది 1936 గురువారము అర్ధ సం॥ చందా రూ ౩

సంపుటము ౧౦ | తూపుబజారు, హైద్రాబాదు - దక్కన్. | సంచిక ౬౭

శా. శ. ౧౮౫౭ శ్రీ యువ సం॥ పౌష్య బ॥ ౧ గురువారము. ౬ ఇస్ఫందియారు ౧౩౪౫ ఫ.

## నియంతల చతుష్టయము



ముసోలినీగారు



హిట్లరుగారు

హిట్లరు, ముసోలినీ, స్టాలిన్, కమాల్ పాషా మొదలగు డిక్టేటర్లు తమదేశములలో తమప్రతికూలురనేకమందిని జైళ్ళకుపంపి, అనేకులను ఉరితీయించి, తమస్వశక్తిచేత, బలపరాక్రమముల చేత సర్వాధికారములను పొందినారు. ప్రతినిమిషమునందు తమ ప్రాణరక్షణ చేసుకుంటూయుంటారు. రక్తపిపాసకులగు శత్రువులు ఎన్నిగజముల దూరములోనే నిలబడి యున్నారనుసంగతి వారికి తెలుసును. సైన్య ప్రదర్శన సమయములందును యీ నియంతలకు అంగరక్షక సహాయమే లేకపోయినచో నేడు ఒక్క నియంతగూడా జీవించి వుండేవాడే కాడు.

రాజులు, మహారాజులకంటెగూడ యీడిక్టేటర్లు (నియంతలు) తమ ప్రాణ రక్షణార్థము అనేక కట్టుబాట్లు చేసుకుంటారు. రాజులకు సామాన్యముగా యిద్దరు అంగరక్షకులు మాత్రమే యుంటారు. కాని హిట్లరు, ముసోలినీ, స్టాలిన్, కమాల్ పాషా ఎప్పుడయినా బయటకు బయలుదేరినచో వారి వెంట ఆయుధపాణులైన అంగరక్షకులు కనీసము యిరువదిమంది యున్నావుంటారు. వీరు తమప్రాణములకు యింత భయపడుటకు ఒక కారణముండి. వారి తదనంతరము యీనియంత పదవిని పొందుటకు సమర్థతగలవారు దేశములో ఎవరులేరని వారి నమ్మకం. యిటలీలో ముసోలినీ తరువాత అతని స్థానము ఆక్రమించుటకు యోగ్యతగలపురుషుడు లేడని ఫాసిస్టుల దృఢవిశ్వాసము. అతని తదనంతరము దేశములో అశాంతి, గడబిడ ప్రబలిపోతుందనికూడా తలుస్తారు. జర్మనీలో నాజీపక్షము వారికిగూడా యిదేఅభిప్రాయం. జర్మనీదేశోద్ధరణకొరకే హిట్లరు అవతారమెత్తినాడంటారు. హిట్లరును హత్య చేయుట ఒక మహాపాతకమని అపరాధమని తలుస్తారు. అయినప్పటికి జర్మనీలో హిట్లరుకు శత్రువులు లేకపోలేదు.

హిట్లరుయొక్క ఆఫీసులో అన్నిట నల్లదుస్తులసిపాయీలు గుండ్లతో నింపబడినపిస్తోళ్లను చేతపుచ్చుకొని పహరాయిస్తూయుంటారు. అగంతకులను ఏకాగ్రదృష్టితో కనిపెట్టుచుంటారు. హిట్లరు తనఆఫీసులో ప్రత్యేక అంగరక్షక దళమును ఏర్పాటుచేసినాడు. ఇందులో ఒకవందమంది నల్లదుస్తులవాళ్లువుంటారు. వారు కవచములనుధరించి తుపాకులు పట్టుకుంటారు. సింహద్వారమువద్ద ప్రత్యేకముగా యిరువురు సిపాయీలు స్వాగత భవనమువద్ద అనేకమంది సిపాయీలు, ఒకగదిలోనుండి రెండవ గదిలోనికిపోవు మార్గములందు, ముఖ్య ప్రదేశములందు శస్త్రధారులైన సిపాయీలు పహరాయిచ్చుచుంటారు.

కాని, హిట్లరు ఎల్లప్పుడు ఆఫీసులోనే కూర్చోవడు. అప్పుడప్పుడు బయటగూడా తిరుగుతూయుంటాడు. అట్లా తిరగటానికి అన్నిటికంటె సురక్షితమైనగాలి విమానమొకటి వుంటుంది. తక్కిన డిక్టేటర్లమాదిరిగా యితడు దానిలో మరఫిరంగిపెట్టడు. హిట్లరుయొక్క మోటారు చాలాగట్టిది. ఇందులోనే యితడు తిరుగుతూయుంటాడు. డ్రయివరువద్ద, హిట్లరుకు యిరుప్రక్కల అత్యంత విశ్వాసపాత్రులయిన అంగరక్షకులు పిస్తోళ్లను చేతపుచ్చుకొని జాగ్రతగా కూర్చుంటారు. హిట్లరు కూర్చున్న మోటారుదగ్గరకు ఎవ్వరినిరాకుండా చూస్తారు. ఎవరయినా దగ్గరకుపోయినట్లయితే యింకా రెండుమూడుగజాలు దూరంగావుండగానే అంగరక్షకుల పిస్తోళ్లగుండ్లు ముందుగా స్వాగతమిస్తాయి.

రూసీదేశ నిర్వాసితులయిన అనేకమంది పారిస్, బార్సిలోనా హోటళ్లలో స్టాలిన్ను చంపాలని రాత్రింబవళ్లు కుట్రలుపన్నుతూయుంటారు, కాని ప్రపంచంలో అందరిడిక్టేటర్లకంటే స్టాలినే సురక్షితంగాయుంటాడట. స్టాలిన్ ఎక్కడవుండేది బయటవానికేమీ తెలియదు. ఎక్కడకువెళ్లేది, ఎప్పుడు వెళ్ళేదీగూడా తెలియదు. వార్తాపత్రికలుగూడా "వచ్చినాడు"అని ప్రకటిస్తాయిగాని "వెళ్తాడు"అని ప్రకటించవు. ఇంత కట్టుదిట్టము ప్రాణభయంచేతే చేసాడో యితరకారణాలచేత చేసినాడో ఎవరికీతెలియదు. కిరోవ్ యొక్క హత్యానంతరము తన ప్రాణరక్షణకొరకు మరింత కట్టుదిట్టాలు చేసాడు. స్టాలిన్, యితరప్రసిద్ధ రూసీనాయకులతో కలసి కిరోవ్ యొక్క శవ వూరేగింపువెంబడి వెళ్లాలని నిశ్చయించుకొన్నప్పుడు ఒకరోజుముందుగా శవముపోయేరోడ్డు మీదగల యిండ్లను సోదాచేయించి ఆరోజున యిండ్లను ఖాళీచేయించినాడు

ఆఫీసులో పనిఅయినతరువాత స్టాలిను క్రెమలిన్ ఆవాసంలో వుంటాడు. ఆస్థానము చేరుట సామాన్యంగాదు. దాని నలుప్రక్కలు ప్రత్యేకశ్రద్ధతో వీరభటులు కాపలాకాస్తారు. స్టాలిన్ దర్శనమువాలంటే ఆగంతకుడు ముందుగా తనపేరు తెలియపరచుకోవాలి. తరువాత కలసుకొనుటకు తేదీనిర్ణయింపబడుతుంది. వచ్చేటప్పుడు పోయేటప్పుడు చాలా జాగ్రతగా పరీక్షిస్తారు ఆగంతకుని సిపాయిలు. స్టాలిన్ కుగూడా అప్పుడప్పుడు తన పరిచయకార్డును ద్వారపాలకులకు చూపించవలసివస్తుంది. యితడెవడయినా స్టాలిన్ వేషములోనుండి [illegible] క్రెమ్లిన్లో జొరబడుచున్నాడేమోయని వీరికిసందేహం.

ఇటలీడిక్టేటరు ముసోలినీని హత్యచేయాలని చాలాప్రయత్నాలు జరిగినాయి. శత్రువులు అతనిమీద గుండ్లుకొట్టినారు. కాని భాగ్యవశమున అతనికిప్రమాదము జరుగలేదు. మూడువందల సిపాయీలుగల ఒకదళము ముసోలినీని రక్షిస్తూవుంటుంది. ఇతర ప్రభుత్వసైనికులతోపాటు వీరుగూడా ముసోలినీవుండే "విలాటోర్లోనియా" నలువైపుల పహరాయిస్తారు. ముసోలినీ ఆఫీసుకెదురుగా ఒకసత్రము వుంటుంది. అక్కడయిద్దరే సిపాయీలు వుంటారు. ఆపార్కులో ఇంకెవరకు తిరుగుటకు గాని నిలబడుటకుగాని వీలుండదు. ఎవరయినా విదేశీయుడు తెలియక వచ్చినట్లయితే వెంటనే వెళ్లగొడ్తారు.

పహరాదార్లు "బాంబు"అంటే చాలాభయపడుతారు. ముసోలినీకేవచ్చేవుత్తరాలు, పార్శెళ్లు, ముందుగా చాలాజాగ్రతగా విప్పిచూచి తరువాత అతనికి అందజేస్తారు. అపార్శెళ్లలో ఏమయినా బాంబువుంటుందేమో అనిభయము. ఈకట్టుదిట్టముచూచి ముసోలినీ నవ్వుకుంటాడు. రాత్రిపూట కాపలావాళ్లను తప్పించుకొని ఎవరికీతెలియకుండా రోమునగర వీధులవెంబడి తిరుగుతాడు. వేసవికాలంలో తనమోటారులో రోము, ఆస్ట్రియాలమధ్య తిరుగుచూ సముద్రస్నానముచేస్తూ యుంటాడు. అప్పుడప్పుడు కృషీకునివలె రైతాంగమున ప్రవేశించి స్వాతంత్రస్వచ్ఛందతను గూర్చిచెపుతూ వుంటాడు. ఈసంగతి తనకాపలా దారులకుగూడా తెలియదు.

టర్కీ డిక్టేటరు కమాల్ పాషాకూడ ప్రాణరక్షణకొరకు ఎంతో కట్టుబాటు చేసినాడు. కమాల్ పాషాను వ్యతిరిక్తముగా ఎక్కడ ఎవరెవరు కుట్రలు పన్నుతూవుంటారో గూఢచారులద్వారా తెలుస్తూవుంటుంది. కమాల్ పాషా బయటకు బయలుదేరినపుడు అతనివెంట ముగ్గురునలుగురు అంతరంగిక మిత్రులుంటారు, ఈ మిత్రులు పూర్వసైన్యాధికారులయి యుంటారు. కమాల్ పాషాను హత్యచేయవలెనంటే ముందు యీ విశ్వసనీయులగు మిత్రులకళేబరములుదాటినసేగాని అతనిచెంతకు పోజాలరు.

ఈడిక్టేటరుల ప్రాణముసదా ఆపదలలో వున్నప్పటికి, వీరు సర్వదా పహరాదార్ల అంగరక్షకులనడుమ వుంటూయున్నప్పటికినీ వీరికి పిరికితనముకలదని చెప్పుటకువీలులేదు. వీరు గొప్పవీరులు, సాహసికులు నయియున్నారు. తమమార్గకంటకుల నగేకులయొక్క రక్తప్రవాహములపారించి అనేకులను ఆజన్మాంతరము చెరసాలలందు పెట్టించి వీరుస్వశక్తి పరాక్రమములచే విశాలశక్తిని సంపాదించ గలిగినారు. ఈమహాశక్తిని రక్షించుకొనుటలో వీరికి నిద్రాహారములుసైతము వుండవు. వీరిప్రాణములు ఎల్లప్పుడు అపాయమువందే వుంటవి. ఈనియంతృచతుష్టయము [illegible] తీసిపోవు వారుకాదు.

—జి. వి. యస్. నాగేశ్వరరావుగారు

హిందీలో ఆర్. ఏ. సింహాగారి వ్యాసమునకుచేసిన అనువాదము.

## కొందరు ప్రభుత్వోద్యోగులపై దొంగసంతకములు చేసిన నేరము

ఔరంగాబాదు జిల్లామేజిస్ట్రేటుకోర్టులో ముగ్గురు గుమాస్తాలుకలిసి కొందరు రోహిలాల కనుకూలముగా ఒకడిక్రీవ్రాసి మేజిస్ట్రేటు సంతకమువంటి సంతకము చేసిరను ఒకనేరము గురించి విచారించుటకై హైకోర్టువారు ఒక ప్రత్యేకమేజిస్ట్రేటును నియోజించిరి. ఆయన ఔరంగాబాదులో విచారణ పూర్తియైనతర్వాత తక్కినభాగమును హైద్రాబాదులో ముగించునని బులెటిన్పత్రిక వ్రాయుచున్నది.

# తెలంగాణా జిల్లాల పునర్నిర్మాణావసరము

## చతుర్థ నిజాంరాష్ట్రాంధ్ర మహాసభా కార్యక్రమము

(౬౬ వ సంచిక తరువాయి)

### వేశ్యావృత్తి నిరసనము.

శ్రీయుత వాసుదేవ మొదలియారు గారు వేశ్యావృత్తిని నిరసించునట్టి ౧౦ వ తీర్మానమును ప్రవేశపెట్టుచు యిట్లుపన్యసించిరి:—

ఈ తీర్మానము ముఖ్యమైనది. మన దేశమున కపకీర్తిని, అపఖ్యాతిని గలిగించు చున్నట్టి వేశ్యావృత్తిని నిర్మూలము గావింప వలసిన యావశ్యకత అధికముగా గలదు. వీరివలన యెన్నియో సంసారములు దుఃఖముల పాలగుచున్నవి. ఆర్థికముగను, శారీరకముగను వేశ్యలు నష్టమును గలిగించెడి వారైయున్నారు. వీరియందు మనము ప్రబోధము గలిగింపజేసి వివాహములు గావించుకొన ప్రోద్బల పరుపవలయును. ఇందుచే మనము దేశమున కెంతయో మేలును జేసినవార మయ్యెదము.

తీర్మానమును ఆమోదించుచు శ్రీయుత పులిగిళ్ల అంజయ్య గుప్తగారు వేశ్యావృత్తికి దోహద మొసగు చున్న పురుషుల చర్యలను ఖండించిరి. వీరి సహాయమువారికి లేకుండెడిచో యీవృత్తి యెంతయో కాలమునకు పూర్వమే పేరులేకుండ పోయెడిదని తెల్పిరి. కొంత కాలమునుండి మనరాష్ట్రమునందు కళావంతుల పరిష్కరణముగూర్చి కావింపబడుచున్న కృషిని గుప్తగారు వివరించుచు వీరల వివాహములు గావించుకొనునట్లు ప్రోద్బల పరుపవలయునని ప్రబోధించిరి.

ఈతీర్మానమునే బలపరచుచు వేశ్యావృత్తి ప్రస్తుతస్థితిని కన్నులకు కట్టునట్లు వర్ణించుచు శ్రీ ఆదిపూడి సోమనాథ రావుగారు పన్యసించిరి. వీరు వేశ్యల పూర్వప్రతాపవైభవమును తెల్పుచు ప్రస్తుతము వేశ్యలుగా మారి దేశమునకు దేశీయుల కపఖ్యాతిని గల్పించుచున్న వీరు పూర్వకాలమున గాన కళాభివృద్ధికి మూలకారకులై యుండిరనియు, వీరు వివాహములాడి దాంపత్యసుఖము ననుభవించుచు దంపతులిద్దరును హరిజనులయందు లేదు గాణమును గడపుచుండిరనియు: వీరిని మరమందరమును పూర్వపు స్థితికి కొనివచ్చుట మనకు ముఖ్యధర్మమై యున్నదనియు తెల్పిరి.

తరువాతదిగువ తీర్మానము యేకగ్రీవముగా నంగీకరింపబడెను.—

వేశ్యావృత్తిని నిషిద్ధమును వ్యభిచార ముగ నెవృత్తిగా దలంచి తన్మూలముగా జీవించుచుండెడి కళావంతులలో వివాహముల ప్రోత్సహించి అట్టివివాహముల చేసికొన గోరెడి వారికి పలువిధ సహాయ సౌకర్యముల గలగింపవలయు ననియు, వీరిని వివాహము జేసికొన యితరజాతుల యువకులెవరేని కోరినచో అట్టివివాహమును గూడ చేయు నాగరిగ వ్యభిచార నిర్మూలనమునకు దేశీయులు తోడ్పడవలయునని యీసభవారు కోరుచున్నారు.

### ముల్కీ-పరిశ్రమలు

గౌరవనీయులగు అధ్యక్షులు దిగువ తీర్మానమును అధ్యక్షాసనమునుంచి ప్రవేశపెట్టిరి

"మనరాష్ట్రమున సిద్ధపరుపబడుచున్న వస్తువులనే జాల హెచ్చుగా నున్నను కొని ముల్కీ-పరిశ్రమల ప్రోత్సహింపవలయునని దేశీయుల నీమహాసభవారు ప్రోత్సహించుచున్నారు."

తీర్మాన మేకగ్రీవముగా నంగీకరింపబడెను.

### జాగీరు ప్రజలు

పన్నెండవ తీర్మానము జాగీరుప్రజల కష్టములను తొలగించుటకై కోరునట్టిది. దీనిని శ్రీయుత కొండా వెంకటరంగారెడ్డిగారు ప్రతిపాదించిరి. తీర్మాన మిట్లుగలదు.

"జాగీరు ప్రజలకు గలుగుచున్న కష్టములను నివారణచేసి వారికి ఖాల్సా యిలాకా ప్రజలతో సమానములగు సౌకర్యములను కలిగించుటకై యీ క్రింది యేర్పాటులు అత్యవసరమని యీమహాసభవారు అభిప్రాయపడుచు యీవిషయమున శ్రద్ధగైకొనుటకై ప్రభుత్వమువారిని వేడుకొనుచున్నారు.

(అ) అయిదుసంవత్సరముల కాలములో ఒక్కగ్రామమైనను మిగులకుండ జాగీరు లన్నిటిలోను స్థిరమైన బందోబస్తు ప్రభుత్వముద్వారా చేయించవలయును.

(ఆ) జాగీరురైతులయొక్కయు, జాగీరుదారుల యొక్కయు పరస్పర బాధ్యతలను హక్కులను స్పష్టపరచుచు శాసనసభద్వార చట్టమును నిర్మించవలయును.

తీర్మానమును వివరించుచు శ్రీరెడ్డిగా రిట్లుపన్యసించిరి.

జాగీరు రైతులకు ఖాల్సా రైతులకంటె కొన్నియిబ్బంది అధికముగానున్నవి. పౌరసత్వము లెక్కుదానాలేదు. ఇంతవరకు ఆనేకజాగీర్లలో స్థిరమైన బందోబస్తుగాని మువ్వాయిదాగాని కానేలేదని చెప్పిన నెంతటి విచారకరమగు విషయమో మీరే యూహింపగలరు. కొన్ని పెద్దజాగీర్లలో జాగీరుపక్షమున బందోబస్తు చేయించి పన్నులనిర్ణయము చేసియున్నారు. కాని ఖాల్సాయిలాకాకన్న రైతులపై అధికముగపన్ను విధించియున్నారు. బందోబస్తైన ఖాల్సాగ్రామములో యెకరమునకు మూడు రూపాయల శిస్తు విధింపబడినచోటికి దగ్గరయున్న జాగీరుగ్రామమున ఎకరాకు ఐదు రూపాయలు అంతకంటె అధికముగ గలదు. ఇంతియగాక బందోబస్తుకాని జాగీర్లలో నిర్ణయింపబడెడి శిస్తుకు పరిమితియే లేదు.

ఖాల్సారైతులవలె బందోబస్తుకాని జాగీరుగ్రామములలోని వ్యవసాయకులకు భూమి పట్టేదారిహక్కులేదు. 3లేక 4 సంవత్సరములు, ఇంతకంటెనధికముగా నొసగిన పట్టేలు భూమిని కౌలుపైనొసగెదరు. ఈకౌలు ధాన్యరూపముగాగాని లేక రొక్క రూపముగాని నొసగు ప్రతిఫలముగా నిర్ణయింపబడియుండును. కొన్ని జాగీర్లలో భూములను యీపద్ధతిపై నిచ్చుచున్నారు. ఇందుచే జాగీరురైతుల ఆర్థికస్థితికి నష్టము కలుగుచున్నది.

ఖాల్సాయిలాకా రైతులు నిర్ణీతమగు పన్నులనొసగి తమభూముల ననుభవించుచున్నారు కాని జాగీరురైతులకు ఖాల్సారైతులపై విధింపబడనేని యితర విధములగు పన్నులుగూడ నొసగవలసి వచ్చుచున్నది. ఇచ్చటి పరిపాలనాపద్ధతియు సరిగాలేనందున జాగీరురైతులకు న్యాయము జరుగుటలేదు. జాగీర్లలో తాత్కాలిక కౌలుమూలమున నగదురూపముగ ని యిటు రూపముగాని శిస్తు గైకొనుచుండుటచే దినదినము శిస్తు చెల్లించుట రైతు లధికభారము ననుభవించుచున్నారు. నికరముగా శిస్తు నిర్ణయముగా నుండెడిచో రైతుల కెంతయో పలుకుబడి. ఇంతియేగాక యీచట్ల కౌలునొసగు విధానమువుండుటచే కౌలు నిర్ణీతకాలము [illegible] అనుభవించి [illegible] తమకుండునది లేనిది నమ్మకముండదు. అందుచే రైతులు తమభూములకు ఎరువు మొదలగువానిని నీటివసతుల యేర్పాటులను గావించుకొనుటలేదు. దినదినము భూమి సత్వముక్షీణించి పంటలు తక్కువగుచున్నవి. రైతులకు పంటలు లేకుండుటచే దారిద్ర్యము హెచ్చుగుచున్నది. ఈ అన్ని కారణములచేతను త్వరగా జాగీరు రైతులకు పట్టాహక్కును స్థిరపరుపవలసిన యావశ్యకత అధికముగా గలదు.

జాగీరురైతులనుండి పన్నులను రొఖ్ఖము కొనుపద్ధతియు విచారకముగా గలదు. రైతులు విద్యావిహీనులై యుండుటచే తమహక్కులను తెలిసికొనలేని స్థితియందున్నారు. వారికి అప్పుడప్పుడు సర్కారువారివలన నొసగబడిన సౌకర్యములు తెలియవు. ఏజాగీరుకైనాని పన్ను నొసగని రైతుయొక్కభూమిని స్వాధీనము గావించుకొను నధికారము లేదు. ఇట్టిస్థితిలో జాగీర్దారు ప్రభుత్వమువారి సహాయమునపేక్షించును. ప్రభుత్వమువారు బందోబస్తుకొని జాగీరు గ్రామముల రైతులనుండి పన్నువసూలు చేయుమని నిర్వాహణ గావించుకొనియున్నారు.

జాగీరు రైతులయొక్కయు, జాగీరుదారులయొక్కయు, పరస్పర బాధ్యతలను స్పష్టీకరించుచు శాసనముల గావింపవలసిన అవసరముగలదు కావున మీరందరు తీర్మానమును యేకగ్రీవముగా నామోదింపవలయునని కోరుచున్నాను.

తీర్మానమును శ్రీ మందుముల రామచంద్రరావుగారు బలపరచుచు ప్రభుత్వమువారు జాగీర్లనొసగునప్పుడు జాగీరునుండివచ్చు ఆదాయము ననుభవించుటకు మాత్రమే అధికారము నొసగియున్నారనియు, రైతులను జాగీరుదారుల కొసపరుపలేదనియు, జాగీరురైతులు సర్కారువారి రైతులే అని స్పష్టము గాగలదనియు, పరస్పర బాధ్యతలు, హక్కులు నిర్ధారణగావింపబడకపోవుటచే జాగీర్దారులకును కొన్నికొన్ని యిక్కట్లుగలవనియు, శాసనసభద్వార యీచట్టమును సాధ్యమైనంత త్వరలో నంగీకారము పడసెడిచో యిద్దరికిని లాభముకలుగుననియు జాగీరు రైతులును మనసోదరులే కాక వారి కష్టనష్టములను నివారణజేయు భారము మనయందును గలదనియు, నుడివిరి.

తీర్మానము సభ్యులందరిచేతను యేకగ్రీవముగా నామోదింపబడెను.

### తెలింగాణాజిల్లాల పునర్నిర్మాణము

పదమూడవ తీర్మానము తెలంగాణా జిల్లాల పునర్నిర్మాణమును గూర్చినది. ఈతీర్మానమును శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డి బి.ఏ.బి.ఎల్. గారు ప్రతిపాదించిరి. తీర్మానమిట్లుగలదు.—

[అ] తెలంగాణాలో చేరవలసిన కోదంగల్లు, అలంపూరుతాలూకాలు మరాఠ్వాడా జిల్లాలో నుండుటవలన ఆతాలూకాలోని ప్రజలకు అనను కూలముగా నున్నది. కనుక వానిని సమీపమునుగల మహబూబు నగరము జిల్లాలో చేర్చవలయుననియు,

[ఆ] నిజామాబాదు జిల్లాను పూర్వమువలెనే మాల్గుజారి విషయములోగూడ మెదకు సూబాలోనే యుంచి అచ్చటిప్రజల కష్టములను తొలగించ వలయుననియు, యీమహాసభవారు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు"

తీర్మానముయొక్క వివరములను తెలుపుచు శ్రీరెడ్డిగారు గుల్బర్గాజిల్లాలోని కోదంగల్లుతాలూకా, రాయచూరుజిల్లాలోని అలంపూరుతాలూకా ప్రజలమాతృభాష ఆంధ్రమైయున్నదనియు, వీరు మహారాష్ట్ర, కర్ణాటక జిల్లాలతో సంబంధము కలిగియుండుటచే అనేకవిధములనుకూల్యములకు లోనగుచున్నారనియు గ్రామపటేలు పట్వారిదఫ్తరము, పైఅధికారులతోగావించు యుత్తరములు మహారాష్ట్రమునందు జరుపవలసియుండుటచే గ్రామాధ్యక్షులకు కష్టము జరుగుచున్నదనియు, రైతులకును జిల్లాప్రధాన స్థలములు దూరప్రదేశమున నుండుటచే వ్యయప్రయాసలకులోను గావలసివచ్చుచున్నదనియు, అందుచే యీరెండుతాలూకాలను సమీపమునందుగల మహబూబు నగరమునందు చేర్చెడిచో రైతులకును, యితరులకును గలుగుచున్న యిబ్బందులు తొలగుననియు, ప్రభుత్వమువారీ విషయమున విచారణగావించి రాష్ట్రీయుల యీప్రార్థన నంగీకరించెదరు గాక యనియు ప్రార్థించుచు తమయుపన్యాసమును ముగించిరి.

తీర్మానమును నిజామాబాదు వాస్తవ్యులగు శ్రీయుత బి. కేశవరావు హైకోర్టువకీలు గారు బలపరచుచు కొంతకాలమునకు పూర్వము రాష్ట్రమును తెలంగాణా, మహారాష్ట్రములందు విభజించి నాలుగుసూబాలు ఒదులురెండు మాత్రమే యేర్పరచినపుడు ప్రభుత్వమువారు నిజామాబాదు జిల్లాను వరంగల్లుసూబాక్రింద చేర్చిరనియు, ఇట్టి [illegible] మువలన కొన్ని అసౌకర్యములు కల్పనమగుటచే మరల నాలుగు సూబాలు యేర్పరుపబడినను మెదకు సూబాలను కారాబ్జీగారు పరిపాలనాకాలము కొలకు నిజామాబాదుజిల్లాను వరంగల్లు సూబాక్రిందనే యుంచవలసినదిగా కోర ప్రభుత్వము వారంగీకరించిరనియు, ఈవిధానమువలన నగలుగుచున్న కష్టనష్టములను రైతులు విజ్ఞాపనపత్రములద్వారా ప్రభుత్వమువారికి విన్నవించుకొనినను యెట్టిలాభము గలుగలేదనియు, న్యాయపరిపాలన మాత్రము మెదకుసూబాక్రిందనే గలదనియు, మాల్ పరిపాలనము వరంగల్లుసూబాక్రిందను, న్యాయపరిపాలనము మెదకుసూబాక్రిందను నుండుటచే రైతుల కెన్నియో యిబ్బందులు గలుగుచున్నవనియు, కారాబ్జీగారు పెదకు సూబేదారులుగా మార్చబడి నూతనసూబేదారులు నియమింపబడినప్పటికి యీవిషయమున ప్రభుత్వమువారు పునరాలోచించి తమనుమునటి యభిప్రాయమునే స్థిరపరచుకొనిరి ప్రతిరిగలదనియు, ఈవిషయమున మాల్ శాఖవారు న్యాయశాఖవారితో అభిప్రాయమును గైకొనగా వారు ప్రజాభిప్రాయమునే బలపరచిరని తెలిసినదనియు, ప్రజాభిప్రాయమును మన్నించివారికిగల కష్టనష్టములను తొలగించుటకు నిజామాబాదుజిల్లాను వరంగల్లుసూబాక్రింద చేర్చవలయునని మనమందరమును యేకగ్రీవముగా ప్రార్థించ వలయుననియునుడివిరి. తీర్మానమేకగ్రీవముగా నంగీకరింపబడెను.

### ఉన్నతోద్యోగములు

అధ్యక్షపీఠమునుండి దిగువతీర్మానము ప్రవేశపెట్టబడి యేకగ్రీవముగా నంగీకరింపబడెను.

"రాష్ట్రములోని ఆంధ్రజిల్లాలయొక్కయు, ఆంధ్రులయొక్కయు ప్రాముఖ్యతనుబట్టి ప్రభుతోద్యోగములలో ఆంధ్రులకు తగినన్ని యవకాశములను కలిగించుటకై ప్రభుత్వమువారిని యీమహాసభవారు కోరుచున్నారు."

౮ వ పేజి చూడుడు

# చతుర్థ నిజాంరాష్ట్రాంధ్ర మహాసభా కార్యక్రమము

3 వ పేజి తరువాయి

### గ్రామపునర్నిర్మాణము

పదునైదవతీర్మానము గ్రామ పునర్నిర్మాణమునకు సంబంధించినది. దీనిని శ్రీ మాదిరాజు రామకోటీశ్వరరావుగారు ప్రతిపాదించిరి. తీర్మానమిట్లు గలదు.

గ్రామ పునరుద్ధరణోద్యమమును కార్యరూపముగా చేయుటకు అధికారి, అనధికార సభ్యులుగల సంఘములనేర్పాటుచేసి తగినవిధిని నిర్ణయించి స్వల్పకాలమున అన్నిజిల్లాలలో ఆచరణలోనికివచ్చునట్లు ఉత్తరువులు చేయవలయునని ప్రభుత్వమువారినికోరుచు తగినప్రయత్నము లు చేయవలయునని గ్రామవాసులను యీసభవారు కోరుచున్నారు.

శ్రీ రామకోటీశ్వరరావుగారు యీ తీర్మానమునై తమ యభిప్రాయమును తెలుపుచు ప్రస్తుతము మనరాష్ట్రమునగల గ్రామములయొక్కయు పరిస్థితులు విషాదకరముగా నున్నవనియు, గ్రామవాసులు విద్యావిహీనులై స్వాతంత్ర్యము నుత్తేజంగక అనేకవ్యాధులబారికగుచున్నారనియు, తమహక్కులను సుస్థిరముగ నుంచుకొనుటచే అధికారులనుచూచినంతనే భయావహులై తమకు జన్మతః సిద్ధించియున్న తమహక్కులను చేతులారా వదులుకొనుచున్నారనియు. విద్యాధికులగువారు గ్రామములనువదలి పట్టణములందు నివసించుచుండుటచే వీరినడుగువారే లేకుండనున్నారనియు, పట్టణవాసులకుగల సౌకర్యములన్నియు గ్రామవాసులకు గలవనితలచుట పొరపాటనియు నుడివిరి. వీరు తమ యుపన్యాసమును విపరించుచు గ్రామవాసుల నభివృద్ధిలోనికి దెచ్చుట విద్యాధికులందరి ముఖ్యకర్తవ్యమనియు, ఇందులకు పట్టణవాసులు ముందడుగు వేయవలయుననియు, ప్రభుత్వమువారును వీరియభివృద్ధికై పాటుపడుచున్నారనియు, వ్యవసాయసంఘములు, వర్తకసంఘములు, పారిశ్రామిక సంఘములు, గ్రంథాలయములు, స్థాపించి గ్రామవాసులకు దీనియందభిరుచి గలిగింపవలయుననియు, నేటివరకును, సహకారోద్యమము గ్రామములందు వ్యాపించకుండుట విచారణీయాంశమనియు, ఇట్టి పురపాలకసంఘముల (లోకల్ఫండుకమిటీలు) వలన గ్రామవాసులు సరియగులాభమును బడయుటలేదనియు, వీనియందు యెన్నికలవిధానము ప్రవేశపెట్టబడవలసి యున్నదనియు, నుడివిరి. తీర్మానమును బలపరచుచు శ్రీ రావి నారాయణరెడ్డిగారు గ్రామవాసులందు ప్రబోధము గలిగించవలసిన కర్తవ్యము పట్టణవాసులదని నుడివిరి. తీర్మానమేకగ్రీవముగా నంగీకరింపబడెను.

### ఆంధ్రనిధి

నాటి సమావేశముయొక్క తుది తీర్మానము "ఆంధ్రనిధి"కి సంబంధించినది. తీర్మానమును ప్రవేశపెట్టుచు బూర్గుల రామకృష్ణారావుగారు నిజాంరాష్ట్రాంధ్రుల అభివృద్ధికై సుమారు ౧౫ సంవత్సరముల క్రిందట ప్రారంభింపబడిన మన ఆంధ్రోద్యమము నేడు అభివృద్ధిదశలో వికసించి నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుచున్నదనియు, ఈయుద్యమము కార్యకారిగా దేశమునందు ప్రబోధకముగా వినపడవలసిన ఆవశ్యకమును దేశీయులుగుర్తించి ధనసహాయమును, అంగసహాయమును చేయవలసియున్నదనియు, ఈ యుద్దేశ్యనివారణకై "ఆంధ్రనిధి" స్థాపింపబడినదనియు, దీనికి దేశీయులు శక్త్యానుసారము ధనసహాయము గావించి తమకర్తవ్యమును నెరవేర్చెదరుగాకయనియు నుడివిరి. తీర్మానమును కొడిమేల భూమయ్యగారు బలపరచిరి. దిగువ తీర్మానమేకగ్రీవముగా నంగీకరింపబడెను:—

నిజాం రాష్ట్రములోని ఆంధ్రదేశమున ప్రబోధము కలిగించుటకును, సత్కార్యముల ప్రోత్సహించుటకును యుద్దేశింపబడియున్న "ఆంధ్రనిధి"కి దేశీయు లుదారభావముతో సహాయము చేయవలయునని యీ మహాసభవారు సోదర సోదరీమణులను వేడుకొనుచున్నారు."

సుమారు ౬-౩౦ గంటలకు సమావేశము సమాప్తమయ్యెను. (సశేషము)

---


మీ శిరోజలను వృద్ధిచేయుటకు

కామినియాఆయిల్ (రిజిస్టర్డు)

ఇదితప్పక జట్టుతలను బాగు చేయును. వెంట్రుకలు రాలిపోవుటను, అకాలమున నెరయుటను తప్పక నిలుపును. చుండును మాన్పి తలచర్మమును శుభ్రపఱచి వెంట్రుకలను బాగుగ పెంచును. ఇంతేగాక దీని యొక్క సువాసన మనస్సునకు మిక్కిలి అహ్లాదమును కలిగించును. వెల సీసా 1 కి 1 రూపాయి. 3 సీసాలవెల రు. 2-10-0 ఖర్చులు ప్రత్యేకము. కోరినవారికి సాంపిల్ ఉచితము.

సువాసన ద్రవములలో రాజు

ఓటో దిల్ బహార్ (రిజిస్టర్డు)

ఇది సమ్మోహనము కలుగజేయు సువాసన నిచ్చునట్టి ప్రీతికరములగు కోమలకుసుమములనుండి తీయబడినది. అందునలన ఒకచుక్క ఉద్యాన వనమునందలి వేలకొలది అప్పుడేకోసిన పూలనుండి వచ్చు మనోల్లాసకరమైన సౌరభమును వెదజల్లును. పోస్టేజికొఱకు 2అణాల పోస్టుబిల్లలు పంపినచో సాంపిల్ ఉచితము.

¼ఔన్సు సీసా 1 కి రు. 1-4-0; ఒక డ్రాము సీసా 1 కి అణాలు 12. వి. పి. చార్జీలు ప్రత్యేకము.

సోల్ ఏజంట్లు:—

ది ఆంగ్లోఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెని,

285, జుమ్మామసీదు. బొంబాయి 2



RAVI PROCESS

సూక్ష్మ రేఖలనుకూడ విడువని పనితనమైన

హాఫ్టోను, లైను, పోస్టరు,

స్టీరియో, రంగు బ్లాకులకు

పేరొందిన పరిశ్రమాలయము

కేటలాగు ఉచితముగా పంపబడును.

రవిప్రాసెస్

ఆదియప్ప నాయకన్ వీధి, సాహుకారుపేట, మదరాసు.



SAFEST CURE FOR MALARIA

KARNIK'S AGUE MIXTURE

జ్వరమునుండి తప్పించుకొనుటకు

కార్నిక్ ఏగ్యూ మిక్శ్చర్

చలి, జ్వరము, మలేరియా మొదలగువాటికి ప్రాచీనమైనమందు. కేవలము రెండుమూడు మోతాదులతోనే జ్వరక్రిములు నశించి జ్వరమువచ్చుట నిలిచిపోవును. రోగులకు త్వరగా సుఖముకలుగును. వేలకొలదిజనులు వుపయోగించి తృప్తిని బడయుచున్నారు.

వెల సీసా1కి 0-12-0;

వి. పి. ఖర్చుతోసహాడజనుకు రూ. 8-2-0

పెద్దపట్టణములలో అన్ని అంగళ్లలో దొరకును చిన్నఊళ్లలో ఏజంట్లుకావలయును- వ్రాయుడు.

[జాబులుయింగ్లీషులో వ్రాయవలెను.]

కార్నిక్ ఏగ్యూమిక్శ్చర్ డిపో,

గిర్గాం, బొంబాయి,

సికింద్రాబాదుఏజంట్లు:-జె. ఫాస్ట్ అండుకో.



కడుపునొప్పినుండి నెమ్మదిజెందుము.

నాగృహములో బుతుసమయమున కడుపులో నొప్పివల్ల చాలబాధ కలుగుచుండెను. వేలకొలదిమందులు వుపయోగించితిని. కాని అన్నిచోట్ల నిరాశయే కలిగెను. హైదరాబాదు దక్కనులో చార్మినారు వద్ద చౌకుమైదానులో నుండు పండిత మనోహరలాల్ లక్ష్మిగారి మందు 40 రోజులు వాడుటవల్ల పూర్తిగా ఆరోగ్యము కలిగినది.

వెల పెద్దది రూ 7-0-0
చిన్నది 5-0-0

ఇట్లు
(సం) మల్లారెడ్డి పటేలు
కంచాపూరు

ఉబ్బసము, దగ్గులనుండి నయమగును

నాతల్లి 60 సంవత్సరముల వయసుగలది ఉబ్బసము, దగ్గులతో చాల బాధపడుచుండెను. వేలకొలదిమందులు సేవించినను లాభము కలుగకపోయెను. చిట్టచివరకు చార్మినారు దగ్గరనున్న చౌకుమైదానులో నున్న పండిత మనోహరలాల్ లక్ష్మిగారి మందు 20 రోజులు వాడగా సంపూర్ణముగా రోగము నయమైనది.

వెల ౪-0-0

[illegible]
వి. రాజయ్య, సుబేదారు
షాబాదీపత్తర్, బషీరుపేట
శంకరబాగ్, హైదరాబాదుదక్కన్



ఆర్. ఆర్. గోపాల్

జనరల్ క్లాత్ మర్చంటు

మీకు తెలియునా?

సిల్వర్ జూబిలీసేల్

సంతోషకరమైన నిజాంప్రభువుగారి సిల్వర్ జూబిలీలో మాఖరీదుదారులకు మొదటిబహుమానము వెండిరంగుగల మోటారుకారు, మరియు 50 వస్తువులు బహుమానముగా పంచిపెట్టబడును. మావద్ద 5-0-0 బట్టలుకొనువారికిఒకప్రైవేటి టిక్కెటుయివ్వబడును. జిల్లాలవారు వి.పి ద్వారా తెప్పించుకొని టిక్కెటులాభము పొందవచ్చును ధరలలో భేదమున్నయడల సొమ్ము వాపసుచేయబడును.

బ్రాంచి.
ఆబిడ్ రోడ్
టెలిఫోను నెం 751

పెద్ద దుకాణము
పత్తర్ గట్టి
టెలిఫోను నెం॥ 576

గోలకొండపత్రిక
యువనామ సం|| పుష్య బ|| ౧
గురువారము

## సిరిసిల్ల ఆంధ్రమహాసభ

ఈసారి సిరిసిల్లలో జరిగిన చతుర్థ నిజాంరాష్ట్రాంధ్రమహాసభకు పోయిన వొచ్చినవాడిగినను, యిటువంటి మహోత్సవముగా యిదివరకెన్నడుగాని యీసభలు జరిగియుండలేదనువారే. ఈమాటను విన్న ప్రతివాడును తనమిత్రుడు తనను పిలుచుకొనిపోనందుకు తప్పుపట్టువాడే.

౧౨౦౦ చదరపు గజాలు వైశాల్యము గల సభామంటపములో జనము—టిక్కెట్లుకొని ప్రతినిధులైనవారును ప్రేక్షకులైన వారును మాత్రమే—మహాసభసమావేశములో నున్నవేళల క్రిక్కిరిసియుండుటయేగాక స్థలములేనివారో లేక టిక్కెట్లు కొనలేనివారో అనేకులు సభామంటపమునకు వెలుపల జీవరత్నా ప్రచారము మున్నగు ప్రచారములు చేయవచ్చినవారికిని ప్రదర్శనములకును పనిపెట్టుచుండిరట. హైద్రాబాదు నగరమునుండి పోయిన ౧౩ బస్సులలో పహా ముత్తమువివిధ ప్రాంతముల నుండి ౩౦ బస్సులలోజనమువచ్చిరట. ఇదేమో గొప్పసంబరముగా నున్నది, చూతమని అనేకులుచుట్టు ప్రక్కల పల్లెల నుండి మొదటిరోజువచ్చిరట. ఇంతయు మన ఆంధ్రమహాసభను గూర్చి యెక్కువప్రచారము జరిగియుండుటను, అనేకులకు మన రాష్ట్రీయాంధ్రులకు తమ అభివృద్ధియే ఉద్దేశ్యముగాగలయీ సభలయందు ఆదరమును సూచించును.

అంతేకాదు. మొదట మొదట యీ ఆంధ్రమహాసభల వృత్తాంతములు యీ ఒకపత్రికలో తెలిసికొనవలసియుండు నట్లుండెడిది. పిమ్మట హైద్రాబాదు బులెటిను పత్రిక సానుభూతి లభించను./అటుతర్వాత బ్రిటిషిండియాలో ఒక్కొక్క దినపత్రికగానుండిన ఆంధ్ర పత్రికయందు నచ్చుట ప్రారంభించెను. గత ఖమ్మం మహాసభనుండి ఆ అదృష్టముపట్టెను. ఈసారి స్థానిక ఉర్దూ దినపత్రికలన్నియును ఆవార్తలను ప్రకటించుటయేగాక, ప్రశంసించనుగూడ ప్రశంసించినవి. ఇందుచేతనే పత్రికలను మాత్రమే విశేషముగా చూచు అనేకులు పెద్దలు అధ్యక్షునికి తమ సంతోషమును తెలియబరచినట్లు వినుచున్నాము. ఆఖరుకు టైమ్సుఆఫ్‌యిండియా పత్రికలోగూడ కొద్దిగానో గొప్పగానో యీసభవార్త వచ్చినది. కావున ఆంధ్రోద్యమాంకురము నానాదిక్కుల కొమ్మలను వేయనారంభించిన దన్నమాట!

ఈసభకు రామణీయకమును ఆపాదించిన మహోన్నత విశేషములలో వ్యాయామపు పోటీలును, సాంఘిక నాటకములును, ఆర్యసమాజమువారి వైదిక ధర్మ ప్రచారమునుచేరియున్నవి. ప్రభుత్వమువారి వ్యవసాయపరిశ్రమల శాఖల సవినాభివృద్ధి ప్రదర్శనములును మరియు ప్రచారకమండలివారి మ్యాజిక్‌లాంతరు ప్రదర్శనములును ఖమ్మంలోవలెనే యీసభలోనూజరిగినవి.

మేము యిదివరకే తెల్పియున్నట్లు యీసిరిసిల్లసభకు విశేషత్వమును ఒసగూర్చు రెండంశములేవనగా, [౧] స్వయముగా ఉత్సాహముతోయేర్పడి శ్రద్ధతో పనిచేసిన ఆహ్వానసంఘము లభించుట; [౨] మనఆంధ్రోద్యమ పితామహుడు అధ్యక్షుడగుట.

ఇపుడు పైన చెప్పబడిన విశేషములేగాక ముఖ్యాతిముఖ్యమైన మరియొక అంశము పేర్కొనదగినది గలదు. గత ఖమ్మంమహాసభలో యెవరో సనాతనులమని ప్రకటించుకొనుచు వివాహవయోనిర్ణయమునకు సంబంధించిన తీర్మానము మున్నగు రెండుమూడు సంఘసంస్కరణపు తీర్మానములను తుదకు చర్చకైనను రానీయకుండ, పడగొట్టియుండిరి. వాటితోకూడ మహాసభకు సంబంధించిన నియమావళి (చిత్తు) కి కూడ వృష్టిదోషము తగిలెను. ఈసారి సభలోనైనను యీనియమావళిగతి యేమగునో యేమోఅని అనుకొనుచుండ, యేవిధమైన ఆటంకములేకుండ అది ఆమోదించబడినది. అదెట్లున్నను నిరుడు సంఘసంస్కరణ తీర్మానములు పడగొట్టబడినపుడు అనేకులు సంస్కరణోత్సాహులు, ఎవరో తీర్మానములను పడగొట్టజూచుటయు, మీరు లొంగుటయునాయని నాయకులపై చాల కోపించియుండిరి. (౧) ఇప్పు డాపక్షమువారు మొదటి విజయము పొందినారు. బాలికలకు ౧౪ యేండ్ల వయస్సువచ్చువరకు వివాహము చేయరాదని సంస్కరణోత్సాహులవాదము. దీనికి సనాతనులపక్షము తీవ్రముగా ప్రతిఘటించి ఓడిపోయినను పిమ్మట మహాసభలో ఆతీర్మానముపై చర్చ జరిగి సంస్కరణ ప్రతిఘటన ఏమో రెండుట్లు సంపాదించుకొని ఓటువంతవరకు తృప్తినొందలేదు.

(౨) ఇంకొకటి సంస్కరణోత్సాహుల విజయము ఇంతకంటె ముఖ్యమైనది గలదు. మహాసభ కార్యక్రమమంతయు తెలుగుభాషలోనే నడుపవలసిన దని వారు పట్టుబట్టిరి. అందుచే నిరుడు నియమావళిలో అనియమము చేర్చక తప్పినది కాదు. అంతేగాక ఈసారి సభాకార్యక్రమమంతయు తెలుగుభాషలోనే జరిగినదని వినుచున్నాము. ఎంత గొప్పవారికైనను గూడ యీ విషయములో 'మాఫీ' యివ్వనే యివ్వరాదని పై సంస్కరణోత్సాహుల పట్టు. వారి యీ పట్టు దివ్యముగా నెగ్గినందుకు వారిని మిక్కిలి అభినందించుచున్నాము. "లేము లపాడలేమకవి నగరములో జరుగు మహాసభలో ప్రసంగములు ఆంధ్రేతర భాషలలోనా? దాదాపు సగము మంది పై తెలుగు మాతృభాషగా గలవారిని కడుపులో పెట్టుకొనియున్న మననిజాం రాష్ట్రములో ప్రభుత్వ విధానమందు తెలుగుభాషద్వారా విద్యనేర్పు పద్ధతికి నియమములలో "ప్రైమరీ" దశలోనే స్వస్తి చెప్పబడెను. ఆంధ్రభాషా వ్యవహారమును ప్రోత్సహించుటకు అటుప్రభుత్వమువారికి సాధ్యము కానేలేదుకదా; యిటు ప్రత్యేకము ఆంధ్రులలోఅక్కె ముఖ్యముగా సాంఘిక భాషాభివృద్ధి కొరకై పాటుపడుచున్నట్లు చెప్పుకొను ఆంధ్రమహాసభ కూడ యీఘోర భాషాదాస్యమును (జ్ఞానమును అని మేము చెప్పుటలేదు, గమనించుడు) వదలించుకొనజాలనిచో అది యెంత లోపమో యిప్పుడు మనస్సుల కెక్కునట్లు చేయబడినది. ఆంధ్రులకు ప్రత్యేకముగ నొక సంస్థ అవసరమైనచో అది ముఖ్యముగా ఆంధ్రులకును తదితరులకును భాషాభేదము ఉండుటవలననే యని తలచవలసియున్నది. ఇతర సాంఘిక వ్యవహారములు మున్నగువాటిలో పాశ్చాత్య నాగరికతా సంపర్కముచే అధికముగా మార్పుగలిగి యితరసంఘములకును అట్టి సమస్యలే యేర్పడియున్నవి. కాని భాషభిన్నమగుటచే తెలుగుమాత్రమే తెలిసినవారు ఆసమస్యలను చర్చించుటకై యితరులతో చేర వీలులేకుండెను. మన ఆంధ్రమహాసభ అట్టిలోపమును తీర్చుటకే అవతరించుచున్నదని తలచెదము. అట్లైనచో తెలుగు మాత్రమే తెలిసిన పద్యాలకు అర్థముకానట్లు యితర భాషలలో కార్యక్రమము సాగించుట యెంత మూర్ఖముగాని తగదు!

మొత్తముమీద విశేషము లన్నియు ఒకసారి సింహావలోకనము చేసిన తర్వాత సిరిసిల్ల మహాసభకు ఆంధ్రోద్యమ చరిత్రయందు వాస్తవమైన ప్రాముఖ్యము నిచ్చునది—"ఆంధ్రభాషా విజయము"న్ను దానికిమూలమైన సంస్కరణోత్సాహుల విజయమున్ను అని చెప్పక తప్పదు. ముందుముందు యీ పక్షము అంతకంతకు ప్రబలమై ఆంధ్రోద్యమమును నాయకుల వశపరచుకొనగలరోజు మాకు దూరముగనున్నట్లు స్పష్టముగా గోచరించుచున్నది!

---

## విజయనగరసామ్రాజ్య వర్ధంతి—

ఇంకొక సంవత్సరమునకు విజయనగర సామ్రాజ్యము స్థాపించి ౬౦౦ సంవత్సరములు నిండినదగును. ౧౩౩౬ క్రీ.శ. విద్యానగరము స్థాపింపబడెనని అనేక చారిత్రకులు అభిప్రాయపడియున్నది. మొన్న బొంబాయిలో కర్ణాటకులు ఈ యెందు సంవత్సరము విజయనగర స్మారక దినమును దేశమందు ఉత్సవముగా జరుపవలెననియు ఆసందర్భమున సభలు చేయవలెననియు, ప్రత్యేకముగా విజయనగర సంచిక ప్రకటించవలెననియు నిశ్చయించినారు. కర్ణాటకులకన్న హెచ్చుగా ఆంధ్రుల కీయుత్సవము సంబంధించినదిగానుండును. ఆంధ్ర చారిత్రక పరిశోధక మండలివారు ఇదివరకు కాకతీయ "దినము" (Day) ను గావించినట్లే ముందు సంవత్సరము విజయనగర (day) దినమునుగూడ చేసి విజయనగర సంచికను ప్రకటించుట చాల ముఖ్యమైన విషయము కాకతీయసంచిక ప్రకటించి అలసిపోయినవారివలె ఊరకుండిన కర్ణాటకుల దృష్టిలో మనము వెనుకబడినవార మగుదుమని సూచించుచు ఇప్పటినుండియే తత్ప్రయత్నములుచేయవలెనని కోరుచున్నాము.

కేసరి రత్నత్రయము

లోధ్ర

గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు బహిష్టుకాలపు ... [illegible]

వెల 12 ఔ. రు 3; 6 ఔ. రు 1-10-0

అమృత

రక్తశుద్ధి ద్రావకము

[illegible]

వెల 12 ఔ. రు 3; 6 ఔ. రు 1-10-0

అర్క

సర్వజ్వర నివారిణి

[illegible]

వెల 6 ఔ. 2-8-0; 3 ఔ. 1-8-0
1 ఔ. 0-8-0

కేసరికుటీరం
ఎగ్మూరు :: మద్రాసు

## ప్రకటన

ఇందుమూలమున అందరికిని తెలియ చేయడమేమనగా, ఇదే హైద్రాబాదు సుల్తానుబజారులో గంగాధర రామన్న పెంటయ్య బట్టల దుకాణమందు యిదివరకు హిస్సాదారుడుగా ఉన్నటువంటి కంది రాజయ్య ౫ ఐవరు గులకినాడు విడిపోయినాడు. కాబట్టి యింకమీద యెవరైనాని సదరుదుకాణమునకు బాకీ ఉన్నవారుగాని, సాహుకారు యివ్వదలచుకున్న సాహుకారులుగాని సదరు కందిరాజయ్యకు యివ్వకూడదు అట్లా యిచ్చేవారు తమ జొమ్మేదారీపై వహించుకొనవలెను.

దః గంగాధర పెంటయ్య
బట్టల వ్యాపారి.

# బజారు ధరలు

## దడువై రామన్నగారు

(హైద్రాబాదు ఉస్మానుగంజు)

౨౯—౩—౧౯౩౯

| | | |
|---|---|---|
| | | పల్లా 1కి రు.అ.ప |
| బజాజీ గోధుమలు | | ,, ౧౨-౧౩౪ |
| గోధుమలు కేలాల్య మొ॥ | | ,,౧౨-౧౨౪ |
| బియ్యము దొడ్డువి మొ॥ | | ,, ౧౩-౧౩౹ |
| ,, వానకరాంలు క్రొత్తవి | | ,, ౧౩౪-౧౮ |
| ,, డిటో పాతవి | | ,,౧౬-౧౬౪ |
| ,, క్రిచిసాంబారులు కొత్తవి | | ,, ౧౮౪-౧౫ |
| ,, రామ సాగరాలు కొత్తవి | | ,, ౧౩-౧౩౪ |
| ,, పిహోడీలు మొదలు | | ,, ౨౫-౩౦ |
| కందులు | పెద్దవి | ,, ౧౦-౧౦౪ |
| కందిపప్పు | పెద్దది | ,,౧౮౪-౧౫ |
| పచ్చ పెసలు | | ,, ౧౦-౧౦౹ |
| పెసరపప్పు | | ,, ౧౮౹-౧౫ |
| నల్లపెసలు | | ,,౮౪౽-౮౫ |
| మినుములు | | ,, ౮౫-౮౪ |
| మినప పప్పు | | ,, ౧౮-౧౮౹ |
| ఉలవలు | | ,,౬౪౽-౫ |
| జొన్నలు | | ,, ౭౪-౧౦ |
| శిరి సెనగలు | | ,౧౨-౧౨౪ |
| సెనగలు | కొత్తవి | ,, ౧౦ |
| వుప్పు | | ,,౧౨౫-౧౩ |
| తవుడు | | ,, ౨౫-౮ |
| పత్తిగింజలు | | ,, |
| అలచందలు | | ,, ౭౪౭౫ |
| ఆనుములు | | . ౯౪-౧౦ |
| ఒటానాలు | | ,, ౭౹-౭ |
| తెల్లనువ్వులు | | ,,౨౩-౨౮ |
| బెల్లము | | ౧౩-౧౮ |
| ఎఱ్ఱ చక్కెర | | ౧౮౹-౧౭ |
| తెల్ల చక్కెర | శే ౮౦కి | .౧౨౹౧౨౫ |
| మదరాసు చక్కెర | | ,, ,,౧౨౪-౧౨౫ |
| వేరుసెనగ | చిప్పవి | ,, ౧౮౫-౧౮ |
| పసుపు | | . ౧౩-౧౮ |
| మిరప కాయలు మొదలు | | ౨౦-౨౬ |
| చింతపండు | మొ॥ | ౧౬-౧౮ |
| మెంతులు మంచివి 16 శేర్లకు | | ౨౪-౨౪౽ |
| అల్లం | 12శేర్లకు మొదలు | ౧౫-౨ |
| కొయ్య | 40 శేర్లకు | ౮౨-౮౩ |
| వుల్లిగడ్డ | పల్లా 1 కి | ౭-౯ |
| యెల్లిగడ్డ | ,, | ౩౹-౩ |
| మెంతులు | 12శే॥ | ౨౪-౨౪౽ |
| వేరుసెనగనూనె | ,, | ౮- |


## రూ2500 లు తిరిగివచ్చును

రూ 13-8-0 లకే

### తరుణ్ బాండులు

ఇవి తరుణ్ అష్యూరెన్సు కంపెనీచే జారీ చేయబడును. ఏజంట్లు కావలయును

చీఫు ఆర్గనైజరు

కర్నాటక్ సెయింటింగు కంపెనీ,

మురళీధర బాగు,

హైదరాబాదు—దక్కన్

## వసంతకుసుమాకరము

ఇది సవామేహామువల్ల కలిగినవ్యాధులు, అతిమూత్రము, మధుమేహము, రాచపుండు రక్తకాస, శ్వేతరక్త ప్రదరములు, చతుర్విధవంధ్యలు, కండ్లుకాళ్లుమంటలు, నిదురపట్టకపోవుట నరముల బలహీనత బోనచేసి, ఆయుర్వృద్ధి, కాంతి, బలము, దైవభక్తిగల సంతానము కలుగజేయును. ఇందుబంగారము, మంచిముత్యము, కస్తూరి మిశ్రము కూడినది. తు॥ కి రూ. 24-0-0

### శతపుర కృష్ణాభ్రకసింధూరము

యిది సమస్తక్షయలు, రక్తకాస, బహుమూత్రము. మూత్రమందు శుక్లముపోవుట, మధుమేహము, నిస్త్రాణబోనచేసి నరములకు బలమును కలిగించును ఇది గ్యారంటీగా క్షయ, అతిమూత్రములను నివారణజేయును. తు. ఒకి రూ 12-0-0

మా ఔషధములుగాని, భస్మములుగాని కోరువారు వ్యాధిని తెలిపినయెడల తగినఅనుపానమును వ్రాసూ గప్లయి చేయగలము. వి. పి ఖర్చులు మీరే భరించగలరు. అడ్రసు:—

శ్రీబాలపరమేశ్వరీ ఆయుర్వేదనిలయము సికింద్రాబాదు రెజిమెంటుబజారు నెం. ౫౩౩౨ ఆయుర్వేదడాక్టరుముశిరానబంగారయ్య

హైద్రాబాదు కోఆపరేటివ్ ఇన్షూరన్సు సొసైటి లిమిటెడ్

ఫతేమైదాన్ హైదరాబాదు (దక్కన్)

వృత్తిగల ప్రతియొకనుడు తనజీవితమును భీమాచేయించి తనవారినిలవిడని భారమును దింపుకొనుట విధి. కావున మీరు హైదరాబాద కోఆపరేటివ్ ఇన్సూరెన్సుసొసైటి లిమిటెడ్ పాలిసీకొని మీ దూరాలోచనను నిరూపింపుడు. ఇందువల్ల దేశములోనిధనం దేశంలోనే ఉండిపోవుటవల్ల ఆర్థికఅభివృద్ధి కలుగను. ఇందులో పాల్గొని మీ దేశహితాభిలాషను వెల్లడించుడి.

సహకార ఉద్యమముతో సేకీభవించువారు మాత్రమే ఏజన్సీలకు దరఖాస్తులను పెట్టవలెను.

## సీతారాం ప్రైవేట్ ఇనిస్టిట్యూట్

6613, వెంకటేశ్వర గుడిపిక్క, సికింద్రాబాదు

మ్యాట్రిక్యులేషన్, ఇంగ్లీషు, అరబిక్, పెర్షియను ఉర్దూ మొదలగు భాషలు సరియైన మాస్టర్లచే నేర్పబడును. ఫీజు స్వల్పము అభివృద్ధినిశ్చయము. బీదల కుచితము.

## శ్రీ కృష్ణ భవన్ రెస్టారెంట్

మిక్కిలి రుచ్యమగు ఫలహారములు, మంచిభోజనము, ప్రయాణీకులకు విశ్రాంతి సౌకర్యములు అన్నియు సరసమైన ధరలలో లభించగలవు, కేషవరి నెలలు నేరుగా మాములుగాను పంపబడును.

కే. యన్. కృష్ణయ్యరు, ప్రొప్రయిటర్ కింగ్ కోఠిరోడ్డు, హైద్రాబాద్ (దక్కన్

## సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, లిమిటెడ్

హైదరాబాదు, సికింద్రాబాదు.

మేము మాయొక్క రజతోత్సవ సందర్భములో వసూలునకై మాపరముగావచ్చు బిల్లులకు హైదరాబాదు ఉన్నను లేకున్నను క్రొత్త సంవత్సరమునుంచి వాటివసూలురేట్లను చాలా తగ్గించితిమని తెలుపుటకు ఆనందము కలుగుచున్నది.

బిల్లుకు నాలుగుఅణాల వంతున యిప్పుడుండు చార్జిని పూర్తిగతీసివేసితిమి. వసూలు చార్జీలు నూటికి 4 అణాలనుంచి నూటికి 2 అణాలకు తగ్గించబడినవి, కాని 1 బిల్లుకు కనీసపు ఛార్జీ 4 అణాలు.

ఇందుచే మాపూర్వపు ఖాతాదారులు ఇంతకుముందుకంటె ఎక్కువబిల్లులు తెచ్చుటకు ఉత్సాహపడుదురని నమ్ముచున్నాము. హిందూదేశమంతటను 80 శాఖలును, పేఆఫీసులును గల్గి హిందూదేశములో ప్రధానమగు దిజాయింటుస్టాకు బ్యాంకువలన క్రొత్తఖాతాదార్లకు కావలసినపనులు చౌకగాను నిరుపద్రవముగాను నెరవేరగలుగునని నచ్చజెప్పుచున్నాము.

ఇ. థామస్

హైదరాబాదు (దక్కన్) శాఖ ఏజంటు

## మహావసంతకుసుమాకరము

ఇయ్యది మధుమేహామను వ్యాధి జిక్కి సౌఖ్యములకు దూరులైనవారి పాలిటికినియుతరమేహాములపాలిటిని శ్రీరామబాణము. శుక్లనష్టముమూత్రరోగములు, సమస్తరోగములు, శ్వాస, కాస, క్షయ, మొదలగువ్యాధులనండివిముక్తినొందించి సంభోగశక్తి, వీర్యవృద్ధి కలుగజేయుటయందు దసమానప్రజ్ఞగలది. స్త్రీల త్రివిధ కుసుమవ్యాధులు, గర్భస్రావ పతనదోషములను,హరింపజేసి దేశవంశప్రతిష్ఠలకు అలంకారమగు సత్సంతానము ప్రసాదింపజేయును. ౧ తులం రు ౩౦-౦-౦ లు

నోటు:—సశాస్త్రీయమైన ఔషధములు సిద్ధముగానున్నవి. కోరువారికి కేట్లాగుఉచితము.

శ్రీ సరస్వతి ఆయుర్వేద ఫార్మసి

ప్రొప్రైటరు, ఆయుర్వేదవిశారద కొత్త వెంకటనారాయణగుప్త, యం. బి. హెచ్ ఖమ్మంమెట్టు (నైజాం)

## వెస్టెండుటాకీసులో

రెండవవారము

అత్యద్భుతమగు నృత్యము, గానములతో గూడిన

ప్రేమఫిల్ము కంపెనీవారి

### హామ్లెట్

ఖూన్కా ఖూన్

నటనటీరత్నములు

సొహరాబు, మోది, నసీం, షంషాద్, (భమ్యా)

వచ్చుచున్నది

### భూపుఛావుం

నటీరత్నములు

ఉమాదేవి, కే. సి. డే. సాన్యాలు

## రాయల్ టాకీస్‌లో

౧ ఇస్ఫందియారు శనివారమునుంచి

ఆనందము, మనోజ్ఞము, ఉత్సాహముగల్గించు

### పూర్ణభక్త

నటులు

కుమార, అన్వరి, తార, ఉమాదేవి, కే. సి. డే.

వచ్చుచున్నవి.

రూప్‌రేఖ, హింద్ కేసరి, ఖూనిఖంజర్

## కృష్ణాటాకీస్‌లో

### జొమెవతి

నాడియ, హసన్‌బాను, బోమన్‌షరాఫ్, మాస్టర్ మహమ్మద్

## మ. ఘ. వ. నిజాం స్టేటు రైల్వే

# ప్రకటన

1936వ సంవత్సరము ఫిబ్రవరి 3 వ తేదినుంచి
ప్రయాణీకుల బండ్ల రాకపోకల కాలములో మార్పు

1936వ సంవత్సరము ఫిబ్రవరి 3వ తేది సోమవారమునుంచి, పెద్దలైనులో 1, 9, 11, నెంబర్లు ఎగువ 2,4 నెంబర్ల దిగువ ప్రయాణీకుల బండ్లయొక్కయును నెం. 10 రు దిగువమిక్సెడు బండియొక్కయును. చిన్నలైనులో 31, 33 నెంబర్ల ఎగువ ప్రయాణీకుల బండ్లయొక్కయు రాకపోకలకాలములో ఈ క్రిందివిధము లైన మార్పులు చేయబడును.

## పెద్దలైను

ఎగువబండ్లు

| | | నెం. 1రు | నెం. 11రు | నెం. 9 రు |
|---|---|---|---|---|
| భోనగిరి | వె. | 13-23 | 5-23 | |
| బీబినగరు | | 13-49 | 5-49 | |
| ఘటకేసరు | ,, | 14-07 | 6 07 | |
| మౌలాలీ | ,, | 14-30 | ......... | |
| సికింద్రాబాదు | వ. | 14-42 | 6-37 | |
| | వె. | 15-00 | 6-45 | 7-12 |
| హైదరాబాదుబి.జి.వ. | | 15-16 | 7-03 | 7-28 |
| | | | | 7-36 పల్లికి పోవును. |

## దిగువ బండ్లు

| | నెం. 2రు | నెం. 4రు | నెం. 10 రు |
|---|---|---|---|
| శంకరపల్లి | వె 6-41 | 14-38 | 19-41 |
| నాగలపల్లి | ,, 7-08 | ... | 20-12 |
| లింగంపల్లి | ,, 7-21 | 15-12 | 20-28 |
| సనత్‌నగర్ | ,, 7-38 | ... | 20-55 |
| బేగంపేట | ,, 7-49 | 15-32 | 21-07 |
| హైదరాబాదు బి. జి. | వ 8-01 | 15-44 | 21-21 |
| | వె 8-35 | 15-54 | 21-34 |
| సికింద్రాబాదు | వ 8-52 | 16 11 | 22-00 |
| | వె. 9-20 | ... | ... |
| | బెజవాడకు వెళ్లును. | | |

## చిన్నలైను

ఎగువ బండ్లు

| | నెం.31రు | నెం.33రు |
|---|---|---|
| మడ్చల్ | వె 5-58 | 20-20 |
| గౌడవల్లి | ,, 6.17 | ... |
| బొలారం | ,, 6-32 | 20-58 |
| అల్వాల్ | ,, 6-42 | 21-07 |
| సికిందరాబాదు | వ 6-57 | 21-21 |
| | వె 7-18 | 21-34 |
| హైదరాబాదు యం. జి. | వ 7-35 | 21-51 |

సబర్బనుబండ్ల ప్రయాణకాలములలోకూడ కొన్నిమార్పులు చేయబడినవి. వివరమైన కాలములకు స్టేషనులలో నిర్ణయకాలపట్టీలను చిట్టీలలోకాని, 1936 వ సంవత్సరము ఫిబ్రవరి 1 వ తేదినుంచి నెలనెల ప్రకటించబడుచున్న టైమ్‌టేబులు పుస్తకములనుగాని చూడుడు.

చీఫ్ ట్రాన్స్‌పోర్టు సూపరింటెండెంటు ఆఫీసు,
సికిందరాబాదు-దక్కన్
2 జనవరి, 1936

ఇ. డబ్ల్యు. స్లాటర్
చీఫ్ ట్రాన్స్‌పోర్టు సూపరింటెండెంటుగా పనిచేయువారి (అజ్ఞాపన)


SOZINA
సోజీన
అంటువ్యాధి, పరవ
రోగములకై రామబాణము!

మొదటిమోతాదుతోనే మూత్రద్వారము నందలి మంటపోయిబాధ పూర్తిగా నయమగును. మూడుదినములుమందువాడిన, చీముపుచ్చు మరకలుపోయి పూర్తిగా నయమగును. ఒక నెలలోపల ఉండిన రోగమైన ఒక సీసా చాలును. చిరకాలపు రోగమైన రెండుసీసాలమందు ఉపయోగించవలెను. ఒక సీసాలో మూడు దినములమందు తొమ్మిది మోతాదులుండును.

వెల సీసా ౧ కి రూ 2—౬—0 పాకింగు టప్పాలఛార్జి వేరు.

హకీం జోహర్ వెల్లోరి
గరీబీఖానా, గోషామహల్, హైదరాబాదు (దక్కన్.)



బొంబాయి వెళ్లినపుడు

సౌఖ్యమునకు ఖర్చు తక్కువకు

శ్రేష్ఠమైన ఆహారము. పరిచారకులు గలరు. ఆరోగ్యమైన పరిసరములు. విశాలమైన గదులు. విక్టోరియా టర్మినస్‌కు 2 నిమిషముల నడక, వ్యాపారమునకు గాని, ఊరేఁటలకు గాని, ఎచటికి వెళ్లదలచినను మిక్కిలి దగ్గర. రేట్లు చాల చవుకను ఉన్నది పదపండి ముందుగా మాకు వ్రాయుడు.

బస చేయుటకు

ది నేషనల్ హిందూహోటలు
బొంబాయిలోనున్న గొప్ప దక్షిణ యిండియా హోటలు.
బెల్లార్డు పీర్ ట్రాంజంక్షను, మింటుకు యెదురుగా, ఫోర్టు, బొంబాయి.
Telegrams—"SUKHNIVAS" Telephone, 25624



జీ. రఘునాథమల్ బ్యాంకర్
హైదరాబాదు—దక్కన్
స్థాపితము ౧౮౧౩

హెడ్ ఆఫీస్
చాదర్‌ఘాట్
తంతినెంబరు. ౨౨౨

శాఖ
పత్తర్‌గట్టి
తంతినెంబరు. ౨౮౫.

మెసర్సు థామస్ కుక్ అండ్ సన్స్ బ్యాంకర్సు లిమిటెడు. ది అమెరికన్ యక్స్‌ప్రెస్ కంపెనీలకు కరస్పాండెంట్సు ఏజెంటు.

ఏజన్సీలు:—లండన్, బొంబాయి, కలకత్తా, మద్రాసు, డిల్లీ, ఆగ్రా, లక్నో, అలిగడ్, అలహాబాదు, బనారస్, కాన్పూర్, బెంగుళూర్, కరాచీ.

పైపేర్కొన్న స్థలములకువేరుగా డ్రాఫ్టు పంపబడును. ఇదిగాక యూరోపుదేశము లో ప్రతిస్థలముయొక్క డ్రాఫ్టు దొరకగలవు.



దక్కన్ అమల
హేరాయిల్
(Deccan Amla Hair Oil)
వెంట్రుకలు పెరుగుటకు ఇదే శ్రేష్ఠమైన హేరాయిలు. సమ్మోహింపచేయునట్టి ఉత్తమమైన పరిమళము. మేలురకపు కొబ్బరినూనెతో చేయబడినది. గొప్పవారు, రాజులు మహారాజులు. ఒకతేపవాడిన దానియొక్క పరిమళమును మీరే గ్రహింప గలుగుదురు.
వెల సీసా ౧కి రూ 1-1-0
మేనేజరు దూకాటాజా కంపెనీ,
శాలిగుండవరం, హైదరాబాదు (దక్కన్)



సహారా ఎక్స్‌ట్రా
SAHARA
GUARANTEED BLADE
శుభ్రమైన సున్నని క్షౌరముకొరకు సహారా ఎక్స్‌ట్రా బ్లేడును వాడుడు.
10 బ్లేడుల గల పాకెట్ వెల 4 అణాలు
పోస్టుబాక్సు నెం. 154 బొంబాయి.

# శేషాద్రిరమణకవుల 'విచిత్రవివాహ' ప్రదర్శనము

శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారు.

చతుర్థాంధ్ర మహాసభ [సిరిసిల్ల] సందర్భములో పాల్గొనిన సోదరీమణులలో సుందరమ్మగారు ప్రశంసనీయులు. బాలికల ఉన్నత పాఠశాల విద్యార్థినులు ఈమెగారి యాజమాన్యమున ప్రతిదినము ఉషఃకాలమున నగరకీర్తనము చేయుచుండిరి, ప్రశాంతమగు వాసమయమున వీరి మధురగీతములు సెంటులో ప్రభావము కలదై వినువారి హృదయముల నానందసాగరమున నోలలాడించుచుండెను. మహిళాసభయందే కాక మహాసభయందుగూడ, బాలికలతో ప్రార్థనా గీతములు పాడించుట మున్నగు కార్యములందు వీరి శ్రద్ధయు, సేవయు, మెచ్చుకొనదగినవిగా నుండెను.

ఈ సుందరమ్మగారు హైదరాబాదు నగరమున ఎంతో వెదకినను ముప్పది సంవత్సరములనుండి సోదరీమణుల అభివృద్ధికై కృషిచే

నాలుగవ కాలం చివరన చూడుడు

వరంగల్లు అమెచ్యూరు నాటకమండలివారు హనుమకొండ తెలుగు లైబ్రరి సహాయార్థమై ౨౫-౩-౧౩౪౫ ఫ. సాయంత్రం "విచిత్రవివాహ"మను నాటకమును ప్రదర్శించిరి. నాలుగు వందలపైబడి జనమువచ్చియుండెను. గ్రామమున నానను సుభిక్షంపెనివారి "చింతామణి" యును "భక్తకుచేల" యను సినిమాయును, నందయ్యగారి హాలులో నాన్ను జరుగుచుండ ఇంతమంది ప్రజలు కౌతుకముతో నీ "విచిత్రవివాహము"ను సందర్శించుట రెండు కారణములను సూచించుచున్నది.

(౧) ప్రజలయందుగల సహకారబుద్ధి.

(౨) నాటకమునందలి ఆకర్షణ.

ఐశ్వర్యనిధులు, ఔదార్య చింతామణులగు వణిగ్వర్యులు, విద్యావంతులగు భాషాభిమానులు, ప్రజాహితసేవకై కాలమును వెచ్చించు న్యాయవాదులు, వీరందరును గూడియుండిన నీపురమున పుస్తక భాండాగారమునకై నీసహాయము జరిగినదన ఆశ్చర్యమేమియును లేదు. దీనివలన ప్రజల నాగరకతయు, సంఘభావమును, ధార్మికగుణమును వెల్లడియగుచున్నవి. తత్ఫలితముగా లైబ్రరివంటి మహాసంస్థలు నెలకొల్పబడి సర్వకాలములయందును ప్రజలందరికిని సేవాసూచకము లగుచున్నవి,

ఇక నాటకవిషయము. "విచిత్రవివా"మను నదొక సాంఘిక నాటకము దీనిని శేషాద్రిరమణకవులు రచియించిరి. ధనాశను సెఱపి వృద్ధులు కన్నియల పరిణయమై వారిజీవితముల నెటుల నాశముజేయుదురో నావిషయమును, సంఘసంస్కర్తలగు యువకులు ఈ దుండగముల నివారించి బాలికల సముద్ధరించు లక్షణములును ఇందు వివరింపబడియున్నవి.

గౌరీనాథుడు వీదబ్రాహ్మణుడు. మాధవ రామచంద్రులతని కుమారులు. శాంతకుమారిత, వివాహ వయస్కురాలగు నీబాలికను ధనకాంక్షంజేసి దీక్షితుడను నొక యాడంబరజీవికిచ్చి వివాహముజేయుట కేర్పాటుజరుగును.

దీక్షితులు పల్లెవంటివాడు. బాహిరస్నయుడితడు. ఎట్లన, పిల్లి తనకన్నులలో శాత్రిపకసులయందు రెండువిధములుగా మాత్రమె రంగులుమార్చును. ఈదీక్షితులు రాత్రియనక పగలనక మార్చును. వీరికి సాంకేతిక నామములు వివిధములుగలవు. ఒకటి హోటలు పెట్టుకొనునప్పుడును; మరియొకటి సురాపానము సల్పునప్పుడును, మూడవది యిన్స్యూరెన్సు కంపెనీలపేరున ప్రజల మోసగించునప్పుడును ఉపయోగపడుచుండును. హనుమకొండలో మోసగించి హైద్రాబాదులో కంపెనీస్థాపించును. సురాపాన మాంసభక్షణములకు తోడు కన్నియలతో వ్యభిచరించుట, యనుగుణ స్వభావమేగదా!

ఈ దీక్షితులు శాంతను గబళించచూచెను. ఎత్తుకు పైయెత్తనునట్లు ఈమె సోదరుడు మాధవుడు రామచంద్రునకు ప్రచ్ఛన్న వేషమున దీక్షితునితో వివాహముసలిపి లేన సహాధ్యాయుడగు పోలీసు శాఖాధిపతి యబ్దుల్ కరీము సహాయమున శాంతను శ్యామునకొసంగును.

ఈ నాటకమును ప్రదర్శించినారందరును గవర్నమెంటు ఉద్యోగుల స్వభావికముగా వారికుండు వ్యాపకములమధ్య లైబ్రరీకి సహాయమొనర్పవలయునను కౌతుకమున శ్రమకోర్చి కృషిసల్పి నాటకకళా సాధనమె వృత్తిగాగొనిన నిపుణులవలె ప్రదర్శనముగావించి ప్రజల నానందపఱచిన వీరల నేర్పు,త్యాగశీలత కొనియాడదగినది.

యస్. వి. సుబ్రహ్మణ్యం
సెక్రటరీ.

ఆదిపూడి సోమనాథముగారు

చతుర్థాంధ్ర మహాసభాసందర్భమున సిరిసిల్లకువచ్చియుండిన ఆర్యసామాజికులు ప్రతిదినము ఉదయమున వైదిక పద్ధతిని హవనము (అగ్నిహోత్రము) జరుపుచుండిరి. ఆసమయమున పవిత్రాగ్ని చుట్టును సుమారువందమంది సోదరులుండుచువచ్చిరి. పండిత. ఆదిపూడి సోమనాథరావుగారు హవనకార్యమును వేదవిధి ననుసరించి జరుపుచు వైదికధర్మోపదేశము చేయుచుండిరి. దీనివలన మహాసభా సందర్భమునపవిత్రములగు ధార్మికభావములు వ్యాపించి కాంతగనపహార్ప్యచుండెను. ఈవిషయమునకృషి సల్పినవారిలో శ్రీయుత శంకరరెడ్డిగారు ప్రశంసార్హులు

మొదటికాలం తరువాయి

యుచున్న విదుషీమణి. నిరాడంబరమై ప్రజాదేశ కార్యమునందు కర్తవ్య నిర్వహణ మొనర్చు ఉత్తమురాలు, ఆంధ్రసోదరీ సమాజస్థాపకురాలు. బాలికల ఉన్నత పాఠశాలయందు సుమారు ఇరువది సంవత్సరముల నుండి గౌరవోపాధ్యాయినిగ పనిచేయుచున్నారు


వచ్చుచున్నది!

సికింద్రాబాదులోని

మనోహర టాకీసుకు

వేల్‌పిక్చర్సువారి

# కృష్ణలీల

ఇంతవరకు తెలుగుమాట్లాడు ఫిలిము లన్నిటిలోను గొప్పది.

రెండు గొప్ప తెలుగుఫిలుములగు "సావిత్రి", "లవకుశ" ల లోని ప్రధాన నటీనటకులను గొప్ప ఖ్యాతిచెందిన యితర ఆంధ్ర నటీనటకులతో చేర్చి తీసిన ఫిలిం.

ఈ క్రింది పేర్లను చూడండి!

ఇంత పేరెన్నికగనినవారింతమంది యింతకుముందెన్నడును ఒక్క ఫిలింలోనైనా నటించలేదు.

(1) * వేమూరు గగ్గయ్య ("సావిత్రి" లోని కథానాయకుడు)
(2) * మిస్ రామతిలకం ("సావిత్రి" లోని కథానాయిక)
(3) * పి. సుబ్బారావు ("లవకుశ" లోని రాముడు)
(4) * మిస్. శ్రీరంజని ("లవకుశ" లోని సీత)
(5) * పి.సత్యనారాయణ
(6) * మాష్టర్ సుబ్బారావు (౯ ఏండ్ల నటకుడు)
(7) * రాజేశ్వరరావు

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ (లిమిటెడ్)

హెడ్ ఆఫీసు: మచిలీపట్నము

స్థాపితము 1925

గమనింపుడు — వయస్సునకు మించిన అభివృద్ధి — గమనింపుడు

| | | |
|---|---|---|
| సాలీనా ఆదాయము | సుమారు | 5,00,000 |
| భీమానిధి | " | 11,50,000 |
| అమలులో నున్న వ్యాపారము | " | 1,00,00,000 |

దినదినాభివృద్ధి గాంచుచున్న ఈసంస్థలోనే
మీ జీవితములను వెంటనే భీమా చేయుడు.

వివరములకు

జి. జగన్నాథము
చీఫ్ ఏజంటు, నిజాంరాష్ట్రము,
జీరా నెం. ౩ సికింద్రాబాద్

యర్రమిల్లి మంగయ్య, బి. ఏ., బి. ఎల్.
కార్యదర్శి.


# ప్రకటన

## సిల్వరుజూబిలీ పారిశ్రామికశాఖ వస్తుప్రదర్శనము యొక్క ఆశయములు

1. మహాఘనతవహించిన శ్రీనిజాంప్రభువువారి రజతమహోత్సవసందర్భము నజరుపబడు వస్తుప్రదర్శనమున పారిశ్రామిక శాఖ యొకటి భాగముగా నుండును. యీశాఖయొక్క కార్యక్రమము ఘనతవహించు (వ్యాపార పారిశ్రామిక) డిపార్టుమెంటుయొక్క గౌరవనీయులగుసదరులు మోహా॥ బహదూరువారిచే అధ్యక్షత వహింపబడిన ఉపసంఘముచే నిర్వహింపబడును.

2. రాష్ట్రముయొక్క సార్వజనిక ఆర్థికాభివృద్ధికి తోడ్పడుటకును, యీ రాష్ట్రమునందలి ప్రజలకు వాణిజ్యము, పరిశ్రమలు, వ్యవసాయము మొదలైన విషయములలో ప్రజలకుగల పరస్పరాభిప్రాయములను వ్యక్తీకరించుకొన నవకాశము గలిగించుటకును, రాష్ట్రమునందుగల వస్తుసంపదలను, చిన్నదిగాని పెద్దదిగాని పరిశ్రమలను లెక్కించుటయు యీ పారిశ్రామికశాఖయొక్క ముఖ్యోద్దేశ్యము.

3. యీ పారిశ్రామిక వస్తుప్రదర్శనశాఖ 1936వ సం॥ ఫిబ్రవరి 24వ తేదీని ప్రారంభింపబడి మార్చి 23వ తేదీని ముగింపబడును.

4. యీ పారిశ్రామిక వస్తుప్రదర్శనము ఏర్పరచుటకుగాను విద్యుద్దీపములు, నీటిసదుపాయము, పరికరణములతో విద్యుచ్ఛక్తియు కల్గి ప్రత్యేకముగా నిర్మింపబడిన షాపడులును, అంగడులును, వస్తుప్రదర్శకులకు అద్దెకు యివ్వబడును.

5. ప్రదర్శింపబడు వస్తువుల రాకపోకలకు చార్జి వస్తుప్రదర్శకులే భరింపవలయును. కాని ప్రదర్శకుల ప్రయాణమునకును వస్తువుల యొగుమతులకును రైల్వేసర్వీసునందు కొంత సదుపాయము చూపబడును.

6. యీ పారిశ్రామిక వస్తుప్రదర్శనశాఖను గురించి ఇంకను వివరములు తెలిసికొనగోరువారు, హయిద్రాబాదు దక్షిణ ఘనతవహించు కచేరీయ౦దుండు పారిశ్రామిక వస్తుప్రదర్శన కార్యదర్శికి వ్రాయవచ్చును.


ఋతువులననుసరించి వచ్చుజ్వరములు

మలేరియా

మొదలయినవి

అమీన్స్ అంటిమలేరియా బిళ్లలు వాడుటవలన త్వరితముగను, నమ్మకముగను తగ్గును. క్వినైన్ మొదలగు ఇతరఔషధములు వాడినతరువాత కలుగు నష్టకరములు దుర్గుణము లేవియు ఈబిళ్లలవలన కలుగవు.

వేలకొలది పురుషులు, స్త్రీలు, శిశువులు ఈబిళ్లలను ఉపయోగించి ఆరోగ్యమును పొందుచున్నారు. హిందూదేశ మందంతటను డాక్టర్లు వీటిగుణములను కొనియాడుచున్నారు.

జ్వరమువచ్చునప్పుడు మొట్టమొదటి సూచన కనపడగనే

అమీన్స్ ఆంటిమలేరియాబిళ్లలు

తీసికొనుడు

అన్నిచోట్లలో దొరకును

ఎ. అమీన్ అండ్ కంపెనీ.,

ఎక్సెల్సియర్ సినిమాబిల్డింగు — హైదరాబాదు—దక్కన్

**A.AMIN & Co.,**

Excelsior Cinema Building, Hyderabad-Decca[n]



# కేరళసబ్బులు

ఘనతకెక్కిన రాజప్రతినిధియొక్కయు, మదరాసు గవర్నరుయొక్కయు పోషకత్వమున బజారులోని హిందూదేశపుసబ్బులకన్న కేరళసబ్బులు శ్రేష్ఠమైనవి. చందనసబ్బు వెల తగ్గినది

ఏజంట్లు:—యం. బి. సుబ్బారావు అండుసన్స్

హనుమాన్ టేక్డి

హైదరాబాదు (దక్కన్)

